The First Telugu Bi-Weekly in Andhra Desa. The only Telugu News Paper for H. E. H. The Nizam'sDominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు—దక్కను

103193 GOLAKONDA PATRIKA HYDERABAD Dn.

సంపుటము ౫ } ప్రజోత్పత్తి నామ సంవత్సర చైత్ర శు॥ ౧౪ బుధవారము 1-4-31 } సంచిక ౨౬

# గాంధీ మహాత్ముని హితబోధ

## అహింసా సత్యములతో గూడిన విధానమే అనుసరించ వలయును

సీమగుడ్డలను కట్టుటవలనను, మత్తుపదార్థములను గొనుటవలనను, లేక విక్రయించుటవలనను, స్వరాజ్యము త్వరలో లభించజాలదు.

ప్రజలు దురాగ్రహమున మైమరచి కత్తులను దూసినచో స్వాతంత్ర్యము సాధ్యము గాజాలదు. కాంగ్రెసుకు నిజమైన బలము అహింసలోనేయున్నది.

## స్వరాజ్యము అహింసచే లభించును

మార్చి నెల ౨౬ వ తేదిన కరాచీలో ప్రచండసభయం దుపన్యసించుచు గాంధీ మహాత్ముడిట్లు పన్యసించెను:—

"నిన్నను మేము రైలుదిగగానే యువకులు ప్రతికూల చర్యలను జరుపుట వలన నాకు సంతోషమే కలిగినదిగాని కోపమెంతమాత్రమును కలుగలేదు. వారింకను తీవ్రముగానే ప్రవర్తించి యుండవచ్చును. వారు నన్ను చంపియే యుండవచ్చును. అందుల కెవరును ముందుగా నాలోచించుకొని రానవసరము లేదు. కాని వారటుల చేయలేదు. వారు చాల మర్యాదగానే ప్రవర్తించిరి.

నేను భారతదేశమునకు నెంతకాలము నింకను సేవచేయవలెనని భగవంతుడు నిర్ణయించెనో అంత కాలావధి ముగియువరకును నా కెవరును నెట్టిహానియును గూడ చేయజాలరు. కాని భగవదాజ్ఞయై నాకు కడపటి ఆజ్ఞ పంపబడినచో నెంతటి ఘనవైద్యుడైనను గూడ నన్ను కాపాడజాలడు.

మన యుద్యమమునకు అహింసయును సత్యమును ఈ రెండును మాత్రమే మూలాధారములుగా నున్నవి. కావున మనము ఈ రెంటింటిని ఎన్నడును గూడ విడువగూడదు. అదియే గాంధి తత్త్వము.

యువకులు దీనినే రూపుమాపగోరిరి. దీనిని వారు నిరసించిరి. గాంధీ తత్త్వము ప్రేమతోను అహింసతోను కూడియున్నది. నన్నును ఈ సిద్ధాంతమును నమ్మినవారి నందరిని చంపివేసినను గూడ గాంధిజము చావదు. నిరుడు జరిగిన సత్యాగ్రహ మంతయును అహింసాత్మకముగనే జరిగినది. అహింసపై నాధారపడియే భారతీయులు పోరాడ గలిగిరి. ఇది అహింసాత్మక మగుట వలననే వేలకొలది పురుషులును స్త్రీలును బిడ్డలును గూడ దీనిలో సంతోషపూర్వకముగా పాల్గొనిరి.



కాంగ్రెసు నియంత

దౌర్జన్యముతోనే ఈ యుద్యమము సాగింప బడినచో విది రవంతమాత్రమును సాధ్యపడి యుండదు.

స్త్రీలందరును ముందుకువచ్చి అహింసాత్మక మగు సాత్త్వికమునే అవలంబింప గోరెదను.

ఇప్పుడు జరుగనున్న కాంగ్రెసు మహాసభలో యువకులు నిరోధములను కలిగించుచు నెడలను సభ జరుగకుండ చేయునెడలను దేశాభివృద్ధిని వారు నిరోధింప గలుగుదురే గాని భగతుసింగు ప్రభృతులను మరల బ్రతికింప జాలరు.

నేను శాంతి క్షేమములతో గూడిన ప్రభుత్వమునే కోరెదను. అదియే రామరాజ్యము అదియే స్వరాజ్యము. అది అహింసవలననే గాని మరి దేనివలనను గూడ లభింపదు.

నాకు కలుగుచున్న స్వప్న మిదియొక్కటే. దీని కొరకే నేను జీవించుచున్నాను. దీనికొరకే నేను భుజించుచున్నాను దీనికొరకే నేను పడుచున్నాను. దీనినే నేను నిరంతరమును స్మరించుచున్నాను. దీనిని గూర్చియే యెల్లప్పుడును బోధించుచున్నాను.

నా నేను నా దేశము కోరుటలేదని యేక్షణమున నేను గ్రహింప గలుగుదునో ప్రజలు నా వాక్యములను తిరస్కరించుచున్నారను నమ్మకము నాకేనిమిషమున స్పష్టమగునో అప్పటినుండియు నేను ఆహారమును పూర్తిగా విడ్చి నా మోపనేత మొనరించి ప్రాణములను త్యజించెదను."

## కాన్పూరులో మత కలహములు

ఇటీవల కాన్పూరులో చెలరేగిన మత కలహములగూర్చి మహాత్ముడిట్లు అభిప్రాయ మొసగెను:—

"ఈ మతకలహముల నెంత తీవ్రముగా నిరసించినను గూడ నాకు శాంతికలుగదు. ఇందులకు గల కారణములను గూర్చి కార్య సంఘమువారు విపులక విచారణ సలిపెదరు. కాని అత్యల్పవిషయములే దారుణ కలహములు కారణమగుచున్నవని గూడ నాకు తెలియుచున్నది. ఈ విషయమును వెంటనే నిర్మూలించెదరనియే నేను నమ్మెదను. ప్రజలు శాంతిని బాసెదరనియును సామరస్యమునకు భంగము కలిగింపరనియును కాన్పూరు నాయకులు వెంటనే కలసి ఆలోచించి శాంతిని కలిగించెదరనియును నేను నమ్మెదను. ఇట్టి అల్లరులు జరిగిన ప్రతిసారియును స్వరాజ్య ప్రాప్తికి ప్రబలమగు అంతరాయము కలుగుచునే యుండును. ఆ స్వరాజ్యమును త్వరగా బడయగోరు వారందరును సరిగా తెలియవలెను"

## దౌర్జన్యము: అహింస

ఈ నెల ౨౭ తేదిన కరాచీయందు పత్రికా విలేఖరులతో సంభాషించుచు ఎఱ్ఱ చొక్కాలవారి ప్రతికూల ప్రచారము గూర్చి మహాత్ముడిట్లు చెప్పెను:—

ఎఱ్ఱ చొక్కాలవారు ౨౫ వ తేదిన కనబరచిన విగ్రహమునే కాంగ్రెసు మహాసభాంత పర్యంతమును కనబరుతురని నేను తలంచుచున్నాను. ఏలన, నేనును వారు

(౩ వ పేజి చూడుడు)

# జవాహరలాలు గారి హెచ్చరిక

## కార్యదీక్షయే జయమునకు సాధ్యము

మనమే యుద్దేశముతో దౌర్జన్యమును ప్రయోగించినను సరే అది మరలవచ్చి మనలనే చుట్టుకొని మనపరస్పర విరోధములకు కారణమగును.

సజీవముగ నే జాతియు సంపూర్ణ స్వాతంత్ర్యము కన్న తక్కువదానిని దేనినిగాని అంగీకరింప జాలదని యువకులు జ్ఞాపకముంచుకొన గలరు.

ఊరక కేకలు వేయుకాలము దాటిపోయినది.

మార్చి ౨౬వ తేది సాయంకాలము కరాచీయందు అఖిలభారత విద్యార్థి మహాసభ పండిత జవాహర్లాలు నెహ్రూగారి యాజమాన్యమున జరిగెను. వారుతమ అధ్యక్షోపన్యాసమున నీడు యువకులకిట్లు యుద్బోధించిరి:—

"ఈనడుమ దేశములో జరిగిన సంఘటనములు నామనస్సునకు చాల వేదన గలిగించుచున్నవి. భగవత్సింగు మున్నగువారి యురిశిక్షలు దేశభక్తులు సాహసవంతులునగు యువకులను రక్షించుకొనుటకు మన మెంత నిస్సహాయులమో జ్ఞప్తికి దెచ్చుచున్నవి. కాన్పూరు బీభత్సమునుగూర్చి కూడ వినియుంటిని. అచ్చట నెంతమందియో మరణించిరి. ఆకొట్లాటలలో న్యాయమిత్రుడగు గణేశశంకర విద్యార్థి కూడ మరణించినట్లు తెలియవచ్చినది. అతడు సంయుక్త రాష్ట్రముల కాంగ్రెసు సంఘమున కధ్యక్షుడు, అతడు నిజమైన కాంగ్రెసువాది. గణేశశంకర్, నిర్భయముగా ప్రజలకు నచ్చజెప్పి శాంతి నెలకొల్ప వలయునను నభిప్రాయముతో కొట్లాటల లోనికి జొరబడియుండెను. అక్కడి ప్రజలు ఒకరినొకరు చంపుకొనుచుండిరి. ఇదియే యాని మరణకారణమైనచో భారతీయుడైన వానికి అంతకన్న నుత్తమ మరణము మరియొకటి యుండదు. కాన్పూరు దురంతములు మనకొక నీతిపాఠము బోధించుచున్నవి. మనమే యుద్దేశములో దౌర్జన్యమును ప్రయోగించినను సరే అది మరలవచ్చి, మనలనే చుట్టుకొని మనపరస్పర విరోధములకు కారణమగుట తప్పదు. దానివలన మనశత్రువులకు మాత్రమే లాభము కలుగును.

"ఈనాడు మనదేశములో నెట్టిసమస్యను గాని మనము దౌర్జన్యము మూలమున సాధింపజాలము. సాంఘిక సమస్య విషయమున దౌర్జన్యము నకే నిరుపయోగము. ఏవో కొన్ని తాత్కాలికములైన ఒడంబడికల వలన కూడ మనము సాధింపదగిన దేదియు లేదు. అసలు వ్యాధిమూలమునే పెకలించిన గాని దానిని మనము నిర్మూలింపజాలము.

"ఈ సమస్యలను పరిష్కరించు భారమును ముఖ్యముగ యువకులే పూనవలసి యుండును. అభివృద్ధికి అడ్డంకముగ నున్న విరోధములను నిర్మూలించివేసి యువకులు నూతన జీవితమును నిర్మింపవలెను. అన్ని విభేదములను అంతరింపజేసి క్రొత్త పద్ధతి జీవితమును పైకి దెచ్చిననే గాని అంతవరకును స్వాతంత్ర్య మనుమాట కర్థము లేదని వారు తెలిసికొనవలెను.

"ఒడంబడికను గూర్చి నేడు కావలసినంత చర్చ జరుగుచున్నది. ఐనను సజీవముగ నే జాతియు సంపూర్ణ స్వాతంత్ర్యముకన్న తక్కువ దానిని దేనినిగాని అంగీకరింపజాలదని యువకులు జ్ఞాపకముంచుకొన గోరెదను. ఇందు కేమాత్రముకూడ పడినను ఒడంబడిక లన్నియు వ్యర్థము గాగలసినవే. పోరాటము మరల సాగింప వలసినదే. అందుచే యువకులు సంపూర్ణమగు రాజకీయ స్వాతంత్ర్యమును గూర్చియు, సాంఘిక సమత్వమును గూర్చియు పూర్తిగ తెలిసికొన గోరెదను. ఊరక కేకలువేయు కాలము దాటిపోయినది. యువకులింక కార్యరంగము లోనికి దిగవలెను. ఎక్కడనైనను సరే, కార్యదీక్షయే జయమునకు సాధ్యము.

పండిత జవాహర్లాలు నెహ్రూగారు



గడచిన సంవత్సరము కాంగ్రెసు అధ్యక్షులు

సుభాష బోసుగారి ఉపన్యాసము

స్వాతంత్ర్యము రాజకుమారుల నిధి, అమూల్యమగు నిక్షేపము దానిని సంపాదించుటకై మనము సంసిద్ధులమై యుండవలయును. స్వాతంత్ర్యము అనగా నా ఉద్దేశ్యము పూర్ణ స్వరాజ్యము మాత్రమే కాదు. కాని బ్రిటిషువారి సామ్రాజ్య వాదముతోడి సంబంధ విచ్ఛిత్తియే ఇతర దేశములన్నిటికంటెను నేను భారతదేశమును అతిగా ప్రేమింతును. మ[illegible]ంటిడి నిచ్చునదియే కాక స్వాతంత్ర్యము వలన [illegible]ము మన పూర్వస్థానవ స్వరూపమును నందుటకు తగినట్లు అభివృద్ధి పొందుటను కావుననే మనకు స్వాధీనత కావలయును. గాంధీ మహాత్ముడు, జగదీశ చంద్రబోసు, మహాకవి రవీంద్రనాథ ఠాకూరు సర్. సి. వి. రామన్, ఆచార్య ప్రఫుల్ల చంద్రరాయిగారు మొదలగు ధీమణులను సంస్మరింపుడు పరాధీనమగు భారతమాత గర్భముననే యిట్టి పుత్రరత్నము లుద్భవించుట సంభవ మయినప్పుడు భారతదేశము స్వతంత్రమైనప్పుడు యింకెందరు మహామహులు జననమొందగలరో! భారతదేశము ప్రపంచమునకు సమర్పవలసిన యాదర్శసేవను పరిపూర్తి చేయుటకై భారతీయులకు స్వాతంత్ర్యము అత్యంతావశ్యకము."

సేనగుప్తగారు

గత సత్యాగ్రహోద్యమములో స్వాతంత్ర్య పోరాటములో విద్యార్థులుచాల హెచ్చుగ పాల్గొనిరి. వారు తగినంతగ భారతమాత పిలుపు నాలించలేదనుట అన్యాయమగు నేరారోపణము. మొట్టమొదటి లాఠీప్రయోగమును చిట్టగాంగునందు లాఠీదెబ్బలను బెంగాలీ విద్యార్థులే భరించి సహించిరి. కాంగ్రెసువారు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమునే బలపరతురు. మీరు నిరాశ పడకుడు. మీరు కాంగ్రెసువారిని ననుసరించియే యోగ్యమగు సంఘనిర్మాణము గలిగి ముందుకు సాగుడు.

సరోజినీదేవిగారు

సంకుచితమగు జాతీయవాదభావములను అధ్యక్షులను నేను నిరసింతును. జాతీయవాదము దేశభక్తి అను రెండుపదములు పోవలయునని నేనువాదింతును. ఏలన అంతర్జాతీయమగు పోరాటములను అవి సూచించునవి. భారతదేశమునకు ప్రపంచమునకుచేయవలసినయాదర్శ సేవను నెరవేర్చుటకై విశ్వమానవ సౌభ్రాతృత్వము అను మహోత్తరమైన ఆదర్శము కొరకై మనము పాటుపడ వలసి యున్నది.

కమలాదేవి చట్టోపాధ్యాయసతిగారు

విద్యార్థులందరును తమ యెదుట సదా సంపూర్ణ స్వాతంత్ర్య ఆదర్శమునే ఉంచుకొని దానికొరకే అచంచలముగ పాటుపడ వలయునని హెచ్చరింతును అన్నివిధములగు ఆర్థికనైతిక పరాక్రమముల నుండి ప్రతిమానవ జీవియు పూర్తిగ స్వతంత్రుడై యెపుడుండునో అపుడే స్వేచ్ఛ నిందింపదగినది. స్పష్టమగు ఆర్థిక స్వాతంత్ర్యమును ఎల్లరును బడయ ప్రయత్నింపుడు.

తీర్మానములు

మార్చినెల ౨౭వ తేదిరాత్రి అఖిలభారత విద్యార్థి మహాసభయందు తీర్మానములపై చర్చ జరిగెను. అందు గాంధీగారి యొక్కయు, కాంగ్రెసు వర్కింగు కమిటీవారి యొక్కయు, నాయకత్వముక్రింద సత్యాగ్రహోద్యమము ఫలించుటను గూర్చి హృదయపూర్వక ప్రశంసా భావమును, వెల్లడిచేయుచు, గాంధీ ఇర్విను ఒడంబడిక తమకు ఆశాభంగము కలుగజేసిన దనియు, సంపూర్ణస్వాతంత్ర్యమున కణుమాత్రమైనను వారు క్రిందికి దిగగూడదనియు, జన సామాన్యమును దారిద్ర్య బాధనుండి తొలగించుటట్టియు, దేశపరిశ్రమలన్నియును దేశీయ ప్రభుత్వ హస్తగతమొనర్చవట్టి కార్యాంగ ప్రధానమే యువకులకు సమ్మతమనియు, అను రెండు తీర్మానములు ముఖ్యమైనవి.

గోలకొండపత్రిక
ప్రజోత్పత్తి నామ సం॥ర చైత్ర శు॥ ౧౪
బుధవారము

# కరాచీ కాంగ్రెసు

(౧)

అఖిల భారత దేశీయ మహాసభయొక్క ౪౫ వ సమావేశము కరాచీ నగరమునందు ఆదివారమునాడు ప్రారంభ మయ్యెను. ఈ మహాసభకు దేశసేవాతత్పరులును, కార్యదీక్షాపరులును నగు సర్దారు వల్లభభాయి పటేలు గారధ్యక్షులు. వీరు రైతు బిడ్డలు బార్డోలీ తాలూకా వీరిజన్మభూమి. గ్రామములందలి రైతులస్థితి బాగుపడిన కృషీవలుల కష్టములీడేరిన, దేశ మున్నత స్థితికి వచ్చునని భావించువారు. అందువలన వ్రాయ్యము నుండియు పటేలుగారు రైతుల అభివృద్ధికై పాటుపడుచున్నారు. గుజరాతు రాష్ట్రమునందలి బార్డోలీ, బోర్సదు మున్నగు తాలూకాల రైతుల కష్టపరంపరలను తొలగించుటకై ప్రయత్నించి యున్నారు. ఇందు వారికి విజయము చేకూరెను. కనుకనే గుజరాతు కృషీవలులు పటేలుగారిని తమ సర్దారుగ జేసికొనిరి. ఇట్టి స్వాతంత్ర్య యోధుడు, అహింసా తత్పరుడు, కార్యదీక్షాపరుడు, రైతుల పాలిటి కల్పవృక్షము, కరాచీ కాంగ్రెసు అధ్యక్షులగుట దేశీయుల అదృష్టమనియే చెప్పవచ్చును.

పటేలుగారు తమ ప్రారంభోపన్యాసమునందు గత సంవత్సర అనుభవముల విశదీకరించుచు ప్రజల భావి కర్తవ్యమును సూచించిరి. స్వాతంత్ర్య సంపాదనకు అహింసా విధానమే ఆచరణయోగ్యమని సూచించిరి. స్వదేశీ ప్రచారము ప్రజల ప్రధాన వాక్కు యు, విదేశవస్త్ర మత్తుపదార్థముల బహిష్కరణ మావశ్యకమనియు, గాంధీ-ఇర్విను ఒడంబడిక షరతులకు లోబడి ప్రస్తుతము శాంతి యుతముగ కట్టుగ నలుపవలసినదనియు, దేశీయులను హెచ్చరించిరి. ముఖ్యముగా దేశీయ సంస్థాన ప్రజలకు బ్రిటిషు ఇండియాలోని ప్రజలకుగల పౌరసత్వపు హక్కులుండవలయునని సూచించిరి.

పటేలుగారి అధ్యక్షోపన్యాసము క్లుప్తముగ నుండి ముందు దేశీయులు చేయదగిన కార్యమును వెల్లడించుచున్నది వారు చెప్పవలసిన దానిని స్పష్టముగ చెప్పివేసిరి. ప్రస్తుత సమయమున అవసరమైనది కార్యదీక్ష. అట్టి కార్య తత్పరతను పురికొల్పి స్వాతంత్ర్య రథమును నడపుటకు పటేలుగారు తెంతయు తగియున్నారు. వారి సారథ్యమున భారత దేశము నకు స్వరాజ్యము లభించుగాక!

## చుంగీ

హైదరాబాదు నగరమునకును సికింద్రాబాదు నగరమునకును బయటనుండి వచ్చిన వస్తువులపై కరోడిగిరి వసూలు చేయుచుండిరి. దీనినే చుంగీఅని వ్యవహరింతురు ఇటీవలనే అనగా సుమారు వారము పదిదినముల క్రిందట యీచుంగీ వసూలు నిలిపివేయ బడినదని ప్రభుత్వము వారు ప్రకటించి యున్నారు. ఈచుంగీవలన ప్రజలకు అంతగా నష్టము లేదనియే మా యభిప్రాయము వలన చుంగీవలన ప్రభుత్వమువారికి సంవత్సరమునకు ౨-౩ లక్షలకన్న నెక్కువ యాదాయము లేదు. హైదరాబాదు సికింద్రాబాదు వంటి పెద్ద నగరములలో మహారాజులు నవాబులు, జంగులు, దొరలువుండు నగరములలో సంవత్సరం లో తెప్పించు సామానులపై ౨-౩ లక్షలు కరోడుగిరి వసూలగుట విచిత్రముకాదు. కావున కరోడిగిరిలో రైతులకు బీదవారికి నష్టముగునట్లు చుంగీలో నష్టము కాదనియే మాయభిప్రాయము. మాకు కరోడిగిరి శాఖవారు గతసంవత్సర నివేదికను పంపరు. అనేక ప్రభుత్వ శాఖలు నియమము లేకయే తమకు తోచినవారికి నివేదికలు పంపుచుందురు. అయినను మేము నివేదికను చూచినంతవరకు ౧౩౩౬ ఫసలి చుంగీవలన ౩౫౦౦౦౦ వసూలయ్యెను. కాని గతసంవత్సరము రిపోర్టువలన చుంగీవలన సుమారు ౨౭౦,౦౦౦ మాత్రమే వసూలయ్యెనని తెలియవచ్చెను.

ఉపదేశితులిట్లున్నను ప్రజల పక్షమునుండి యీ చుంగీ అక్రమమైనదని పలుమారు ధ్వనులు వచ్చుచుండెను. జోగిపేటలోని ప్రథమాంధ్ర సభలోను ద్వితీయాంధ్రసభలోను నీచుంగిని నెత్తివేయవలయునని తీర్మానములు కావింప బడెను. ఇప్పుడీ చుంగీ యెత్తివేయుటకు సభా తీర్మానములకేమైన సంబంధమున్నదా లేక కేవలము "బాదరాయణ సంబంధమా" యేమో మాకు తెలియదు. మన ప్రభుత్వమువారు ప్రజల యబలబలకు చెవియొగ్గ మొదలు పెట్టినారని మేము తలంచగలము. ౭ పండ్లనుండి ఘోషించుచున్నను ఖాస్గీపాఠశాలలపై పెట్టిన నుగ్రీవాజ్ఞను తొలగించక విద్యాశాఖాధికారులు శుద్ధబుద్ధి విగ్రహులై పలుకనేరకరు ౧౦ ఏండ్లనుండి సభలపై ఆంక్షయున్నను సుమారు రెండేండ్లక్రిందట ప్రాతశాసనము బాగుగా లేదని దానికన్న మేలైనశాసనమును చేసిరి ముల్లుముప్పు మేకు మేలు అనిచెప్పి ముల్లుపీకి కాలిలో మేకు కొట్టినట్లున్నది. అది అప్రస్తుతము.

ఇక ప్రస్తుతమునకు వత్తము ప్రభుత్వము వారు తమకే దయగలిగి యీచుంగీని యెత్తివేసినారని యుంచుదము ఈకార్యమునకై దేశజనులందరును కృతజ్ఞులుగా నుండవలసినదే.

అయితే మాకు కొన్నిసందేహములున్నవి. చుంగీ యెత్తివేసినను కరోడుగిరీల దగ్గఱ నేమియు దౌర్జన్యము లేకుండ నేమియేర్పాటులైనవో మేము కరోడుగిరివారికి వ్రాసినను వివరము తెలియలేదు సాధారణముగా సముద్రము నుండి వచ్చు సరుకులపై బొంబాయి వంటి రేవుపట్టణముల దగ్గర మొదలుపన్ను వసూలు చేయబడును. తర్వాత బ్రిటిషు ఇలాకానుండి మనరాష్ట్రములోనికి వచ్చునప్పుడు రెండవతూరి పన్నువసూలు చేయబడును. అటుపై మన రాష్ట్రమునుండి హైదరాబాదు నగరములోనికి అదేసరకు వచ్చునప్పుడు మూడవతూరి కరోడిగిరి వసూలు చేయబడును. ఉదాహరణార్థము.

పట్టు (రేషమ్-జై సరిరకము) పల్లాకు ౫౦ రూపాయిలు కరోడిగిరి వసూలు ౫౦-౦-౦

ఇదేప్రకారము బొంబాయిలోతీసికొనిన ౫౦-౦-౦

ఇదేప్రకారము హైదరాబాదులో వసూలయిన ౫౦-౦-౦

అనగా హైదరాబాదులోనికి ఒక పల్లాతూకము గల పట్టువచ్చినట్లైన ౧౫౦ రూపాయిలు కరోడిగిరికి మాత్రమే (అనగా (బ్రిటిషు మొగలాయి కలసి) యియ్యవలసి యుండును.

అయితే యిది యసాధారణమగు యుదాహరణము. సాధారణముగా నూటికి౫ రూపాయిలు కరోడిగిరి మనవారు తీసికొందురు. ఇటులే బొంబాయిలో తీసికొందురనుకొనిన ౧౦౦ రూపాయిల వస్తువునకు ౧౦ రూపాయిలు మనరాష్ట్రములోనికి వచ్చువరకియ్యవలసి యుండును. అపై హైదరాబాదునగరమునకు వచ్చినమరియొక ౫ రూ. యియ్యవలెను ఇట్లు ౧౦౦ కి ౧౧౫ రూపాయిలగును. ఇది ప్రజలకు నష్టమే యనవలెను.

ఇక ముందీనష్టములో ౧౦౫ మారుగా ౧౧౦యే వసూలగుటచే ప్రభుత్వము వారికి ౧౦౦ పై ౫ రూపాయిల నష్టమును రైతులకీ ౫ రూపాయిల లాభమును కలుగును.

ఇక విచారింపదగినది ముందు చుంగీవిషయమను చర్చలు. రైలునుండి ప్రయాణీకులు జిల్లానుండియే తెచ్చిరో బ్రిటిషుయిలాకానుండియే తెచ్చిరో యూకేమి తెలియును అనిచుంగీకిబదులు గాకరోడిగిరివసూలు చేసిన యెట్లు? ఈ విషయమున కరోడిగిరివారు విశదముగా ప్రజల కిబ్బందులు లేనట్లుగా నాజ్ఞలు కావించిన బాగుండును. స్థలమునుండి వచ్చు వారాస్థలమునుండి సామానులను తెచ్చినట్లు గ్రామాధికారులనుండి చిట్టీలు పొందిన నగరములో వానిని పరీక్షించకయే వదలిపెట్టుట మంచిది.

సాధారణముగా కరోడిగిరీ స్టేషనులో కరోడిగిరీవారి చర్యలు చిత్రముగా నుండును. క్రొత్తగా జైలులకు పోయినవారి వస్తులన్నియు పరీక్షించినట్లు ప్రయాణీకుని పూర్తి పరీక్ష పలుమారు జరుగుచుండును. అనుమానస్థుడగు నుల్లై దొంగను పోలీసువారు నిలిపి వానిమూటను పరీక్షించినట్లు పాపము ప్రయాణీకులు ఫలాహారము డబ్బాలు తెచ్చినను వానిని పరిశోధించక మానరు. మరియు స్త్రీలు తమ చీరలు సొమ్ములు మామూలు ధరించు వస్తువులు పెట్టెలలో తెచ్చినను నింటిగుట్టు బట్టబయలు చేసినట్లు బాటలో వారి పెట్టెలను దింపించి వస్తువులన్నియు తలక్రిందుచేసి లొడబెట్టనిది మానరు కొన్నికొన్ని సమయములలో బ్రిటిషు ఇలాకావారు మనదేశ మర్యాదలు తెలియక యిట్టిచర్యలను సహించునలవాటు లేనివారగుటచే కరోడిగిరివారిచే తగవులాడుదురు. దానిఫలితముగా వారికింకను కష్టములు కలిగిన విచిత్రమేమి? కొన్ని సమయములలో చిట్టీ చేయుమని బహుకాలము ప్రయాణీకుల నాపుదురు. ఒకతట్టు జట్కాబండివాడు పీకులాడును. ఒకతట్టు కరోడిగిరీవారు ఆలస్యము చేయుదురు. స్త్రీలతో సహా వచ్చిన వారిని చూపెట్టుకొనుట యొక్క శ్రమ. ఈ విధముగా పీడింపబడి ప్రయాణీకుడు తుదకు విసిగిపోవును.

ఇట్టి బాధలు కలుగకుండునట్లుగా యేర్పాటు చేయుట మంచిదని మా యభిప్రాయము.

# పటేలుగారి ప్రబోధము

## స్వదేశీ పరిచారము ప్రతిజాతికి జన్మహక్కు

రౌండుటేబిలు సభలో స్వరాజ్యమును బడయుటకు మార్గాంతర మేదియును కనబడనియెడల కష్టానుభవముతో కూడిన శాసనోల్లంఘనమే శరణ్యమగును

హిందూదేశ రాష్ట్ర ప్రజలకువలెనే సంస్థాన ప్రజలకును పౌరసత్వపు హక్కులను నిర్వచింప వలయును

మనకు కావలసినది హృదయముల యైకమత్యము గాని కాగిదములపైన వ్రాయబడిన కృత్రిమమైన యైకమత్యము కాదు

డిల్లీ ఒడంబడిక ననుసరించి పూర్ణ స్వరాజ్యమును కోరుటకు హక్కుగలదు

కరాచీ కాంగ్రెసు అధ్యక్షులగు సర్దారు వల్లభభాయి పటేలుగారు అధ్యక్షోపన్యాసమును ప్రారంభించుచు పండిత మోతీలాల నెహ్రూ మౌలానా మహమ్మదలీగార్ల కీర్తిశేషులైనందున వారి కుటుంబముల కను సానుభూతిని తెలిపిరి. అజ్ఞాత యోధుల కుటుంబములకు సానుభూతిని వెల్లడించిరి. భగత్సింగు ప్రభృతుల ధైర్య సాహసములను దేశభక్తిని త్యాగమును ప్రశంసించిరి. అయినను వారవలంబించిన విధానముతో తాము నేకీభవింపజాలమని వాక్రుచ్చిరి. లాహోరు శిక్షలవలన ప్రభుత్వము వారి నిర్దాక్షిణ్యము బాగుగ వెల్లడియైనదని సూచించిరి. ఇపుడు కలిగినంత ప్రబలముగ ప్రజలలో రాజకీయ జాతీయ ప్రబోధ మిదివరకెన్నడును కలిగియుండలేదనియు, అహింసా సిద్ధాంతమును దేశీయులందరును గూడ కొనసాగింప గలిగిరనియు, అహింసయందుగల అనంతశక్తి నీ భారతదేశమిపుడు నిదర్శనపూర్వకముగ నెల్లడింప గలిగెననియు, కృషీవలులే అందరికంటెను బాగుగ వెల్లడింపగలిగిరనియు, స్త్రీలను, బిడ్డలను, అత్యధికముగ సేవజేసిరనియు, సత్యాగ్రహోద్యమము సఫలమగుటకిదియే ముఖ్య కారణమనియు, భారతీయులవలంబించిన ఉద్యమము విశ్వమునకంతకును సంబంధించినదనియు, అన్ని దేశములవారును ముఖ్యముగా అమెరికా సంయుక్త రాష్ట్రముల వారు భారతీయులపట్లసానుభూతిని చూపుచున్నారనియు, తెలిపిరి.

### గాంధీ ఇర్విను ఒడంబడిక

గాంధీ ఇర్విను ఒడంబడిక గూర్చియు, రౌండుటేబిలు సభ గూర్చియు, ఇట్లు నుడివిరి:—

గాంధీ ఇర్విను ఒడంబడికను మీరు ఆమోదించెదరను దృఢ విశ్వాసముతోనే కార్యసంఘము వారు సమ్మతించిరి. కార్యసంఘమువారు మీచే నధికారమొసంగబడిన మీ ప్రతినిధులగుటచే వారామోదించిన యొడంబడికను మీరుకూడ స్థిరపరచవలయును గాని దీనిని తిరస్కరించుటకు మీకధికారము లేదని కూడ నేను తలచెదను. ఈ యొడంబడిక రెండుపక్షములవారికి చాల గౌరవప్రదముగానే యున్నది. మనము దీనిని ఆమోదింపక పోయినచో ప్రపంచముయొక్క నిందకు పాత్రులము గావలసి వచ్చును. దేశీయుల కష్టముగూడ నిష్ఫలమగును. కాంగ్రెసువారు రౌండుటేబిలు సభలో పాల్గొనవలయునని ప్రధానమంత్రి, ఇండియామంత్రి, రాజప్రతినిధిగార్లును, దేశీయులలో విఖ్యాతులగు సోదరులును, కోరియుండుటవలనస్వపరిపాలనమును రౌండుటేబిలు సభలో కోరుటకు కాంగ్రెసువారికి అవకాశ మియ్యబడు నెడలను రౌండుటేబిలు సభలో కాంగ్రెసువారు పాల్గొనుటయే కర్తవ్యమని కార్యసంఘము వారు తలచిరి, ఆ సభలో మన ప్రయత్నము కొనసాగకపోయిన యెడలను, స్వరాజ్యమును బడయుటకు మార్గాంతర మేదియును కనబడని యెడలను, కష్టానుభవముతో గూడిన శాసనోల్లంఘనమే శరణ్యమగు నెడలను, అదియే మనకు మహాభాగ్యమగును. డిలీ ఒడంబడిక ననుసరించి మనము పూర్ణస్వరాజ్యమును కోరుటకు హక్కుగలదు. సైన్యము విదేశ వ్యవహారములు, ఆర్థికవిధానము మొదలగు అన్నివిషయములపైనను సంపూర్ణాధికారము కోరుటకు మనకు హక్కుగలదు. రక్షణోపాయములుగాని, మినహాయింపులుగాని, మన శ్రేయమును లక్ష్యముంచుకొనునవే యేర్పడును

### సైన్యము బ్రిటిషు సహాయము

ఇపుడు మనకు సైనికపుణ్యము అవసరమై యున్నది. ఇంగ్లీషువారి విషయములో సాయపడెదమన్నచో ఏల మనము వారి సాయమును పరిగ్రహింపగూడదు? ఇది ఒక్క ఉదాహరణము మాత్రమే. ఇట్టివి పెక్కు గలవు. కావున దేశసంరక్షణ కాలములో రక్షణోపాయము (బ్రిటిషు సైనికోద్యోగులను బ్రిటిషు సోల్జర్లనుకూడ కొందరను చేర్పవచ్చును) నిలుపుకొనుట మాత్రమై యుండవచ్చును. కాని, దేశ సంరక్షణాధికారము మాత్రము బ్రిటిషువారి చేతిక్రింద నుండగూడదు. బ్రిటిషువారి సలహాను మనము కృతజ్ఞతతో నందుకొనవచ్చును బ్రిటిషువారు అధికారము చలాయించుట మాత్రము మన మంగీకరింపజాలము. హిందూదేశమును సంరక్షించుటకై పరదేశమును హిందూదేశ సైన్య మెదుర్కొనిన సమయమొక్కటి కూడ పొడకట్టుటలేదు. కావున విదేశములెవ్వియో మనపై బడునను భ్రాంతిచే మనము భీతిల్లవలదు. మనకు సైన్యము వలసియున్నను ఆపరిటి సైన్యరీత్యమొకటి మనకు వలదు. ఆసైన్య వ్యయభారము పరిపోషణకై మనము అనుదినము పీల్చివేయబడుచున్నాము.

### సివిల్ శాఖల పరిపాలనము

హిందూదేశము స్వాధికారమును స్వీయాభ్యుదయమును గాంచవలయుచో, సివలు సర్విసు వ్యయమును చాల తగ్గింపవలసి యుండును. దీనికి ఫలితముగా సివిల్ ఉద్యోగుల వేతనములు తగ్గింపవలయును.

### పూర్ణ స్వరాజ్య తీర్మానము

లాహోరులో సంపూర్ణ స్వాతంత్ర్యమును మనము తీర్మానించుచున్నాము. అంతటినుండి మనము వెనుకకు తగ్గుటలేదు. ఈ స్వాతంత్ర్య శబ్దము వలన బ్రిటను దేశముతోగాని మరియే దేశముతోగాని, సంబంధమును విడగొట్టవలెనని ఉద్దేశింపలేదు. అన్యోన్య రహితార్థమై సమానమైన భాగస్వాములుగా నెవరి యిష్టముచొప్పుననైనను విడిపోవు స్వాతంత్ర్యముతో సంబంధము గలిగియుండుటకీ స్వాతంత్ర్యశబ్దము అడ్డురాజాలదు.

### ఫెడరేషను

ఫెడరేషను ఆకర్షణీయమైనభావమే. కాని దానివలన క్రొత్త చిక్కులు కలసూపుచున్నవి. సంస్థానాధిపతులు సామ్రాజ్య విచ్ఛేదమును చెవిబెట్టరు. అయినను వారు సరియైనభావముతో ఫెడరేషనులో చేరుచో, అది లాభకారియే వారుచేయుట ప్రజాపాలనాభివృద్ధి కంతరాయముగా నుండగూడదు. కావున వారు స్వాతంత్ర్యభావమునకు సరిపడని నియమములు తలపెట్టకు గాక యని నేను ప్రార్థించుచున్నాను. యుగధర్మమునుబట్టి ముందు నడచెనున్నామని సంస్థానాధిపతులు స్వయముగా పెద్దల ప్రోద్బలము లేకయే కార్యరూపముగా నమ్మజెప్పెదరుగాక!

### సంస్థానప్రజలు

హిందూదేశ రాష్ట్రప్రజలకువలెనే, సంస్థాన ప్రజలకును పౌరసత్వపు హక్కులను నిర్వచింపవలెను. హిందూదేశములోని జనులు యావన్మందియు ప్రధానమైన కొన్ని సామాన్యపు హక్కులను సమానముగా కలిగియుండ నొప్పును అట్టి హక్కులున్నచో, వాటి ఉల్లంఘనము సరిపెట్టుటకు ఎల్లరకును సమానమైన న్యాయస్థానముండవలెను. అంతేగాక, పెడరలు కొంతవరకైనను సంస్థానప్రజలకు ప్రత్యక్ష ప్రాతినిధ్య ముండవలెనని కోరుటలో నెక్కువేమియు లేదు.

### బర్మావిభజనము

బర్మా విషయములో. ప్రభుత్వమువారి వార్తాచ్ఛాదన వలన, నిజమైన పరిస్థితుల నెరిగికొనుటకు మనకు వలనుపడదు. బర్మాదేశము హిందూదేశము నుండి విడిపోవలెనా, లేక స్వతంత్రభారతమున నొక భాగముగా నుండవలయునా యనుట బర్మావారే నిశ్చయింప నర్హులు. కాని బర్మాలోని అన్నిపక్షములవారును తమమనస్సు స్పష్టీకరించు నవకాశ ముండవలెననుట మనకేగాక ప్రపంచమున కంతటికిని ముఖ్యమైయున్నది.

### హిందూమహమ్మదీయ సమస్య

దేశములోని ఆయాసంఘములకు సంతృప్తి నీయజాలని సాంఘిక సమస్యా పరిష్కారమున

ను కాంగ్రెసువారంగీకరింపజాలరు. నేను హిందువుడనగుటచే నాకు పూర్వము అధ్యక్షులుగానుండినవారి పద్ధతినే నేనును అనుసరించెదను. స్వదేశీ కలమును స్వదేశీ కాగితములను తీసికొనిపోయి అల్పసంఖ్యాక సంఘములవారికిచ్చి వారి కోరికలను వ్రాసి యీయమని కోరెదను. వారి సూచనలను నేనామోదించెదను. అది అన్నిటికన్న దగ్గరదారి. కాని దీని ననుసరించుటకు హిందువులకు ధైర్యముండవలెను. మనకు కావలసినది హృదయముల యైకమత్యము కాని కాగితములపై వ్రాయబడిన కృత్రిమమైన యైకమత్యము కాదు. ఈ రెండవ యైకమత్యము ఏపాటి భారముమీద పడినను సరే, భగ్నమైపోయి యూరకుండును. సాంఘికముగ నైకమత్యము సమకూర్చుటకు మూడవ సమావేశములకు కూడ సాధ్యము కాదు. దానిని మనమే సాధించుకొనవలసి యున్నది. ఈ విషయమున కాంగ్రెసువారి ప్రయత్నలోప మేమాత్రము నుండగూడదు.

## ఒడంబడిక షరతులు

కాంగ్రెసునకు తగినంత బలము చేకూరినను కాని పూర్ణస్వరాజ్యమును సంపాదించి యీయజాలదను సంగతిని మన మందరమును స్పష్టముగ తెలిసికొనవలెను. మనకిప్పుడున్న శక్తికి మనము మరింతశక్తిని సమకూర్చుకొనవలసి యున్నది. అట్లు ఎక్కువబలము సంపాదించుకొనునంతవరకు గల మార్గములలో గాంధి - ఇర్విన్ ఒడంబడిక షరతులను మనము అక్షరశః నెరవేర్చుట యొకటి.

## విదేశవస్త్ర బహిష్కారము

ఇంక మన లక్ష్యముల నన్నిటిని పొందగజేసికొనుట రెండవమార్గము. మనము విదేశవస్త్ర బహిష్కారము విషయమున చాలవరకు ముందుకు సాగివచ్చితిమి. ఈబహిష్కారమువలనకలగు హానికి జంకేకాక అది మన కర్తవ్యము కూడను. బహిష్కారము లేకపోయినచో నిరుపేదలుగ నున్నవారు కోట్లకొలది ప్రజలు మాడి చావవలసినదే. చౌక ధరలకు విదేశవస్త్రములు వచ్చి పల్లెటూళ్ల నాక్రమించి వైచినచో, రాట్నపు పరిశ్రమ పెంపొందనేరదు. అందుచే విదేశీగుడ్డ దేశములో లేకుండ జేయవలసినదే. ఒకవేళ విదేశవస్త్రము లున్నను దొరికినను, అవి చాల ప్రియముగ నుండవలెను. ఇప్పుడు కోట్లకొలదిగ ప్రజలు తిండిలేక మాడుటకు కారణము దేశము నిస్సారమయిన దగుటకాదు. పైరుపంటలు లేనికాలములో వారికి పని దొరకకుండుటయే ఆ కారణము. కాబట్టి తమతమ గ్రామములలో వారికి సులభముగ పని దొరకకపోవుట వలననే, వారు తిండిలేక మాడవలసి వచ్చుచున్నది. మన వ్యవసాయదారులకు ఈ పని లేనితనము సహజమై పోయినది. ఈవ్యాధిని కుదుర్చవలెనన్నచో, అందుకు నిరంతరమగు ప్రతిచార మవసరము. ఈ నష్టమునకు మనము స్వయముగా నూలు వడికి ఖద్దరు బట్టలను ధరించుటయే ఇట్టి ప్రతిచారమున కుత్తమమైన పద్ధతి. విదేశవస్త్ర బహిష్కారము కేవలము రాజకీయమైన ఎత్తుగడగా నేర్పడినదికాదు. అది ప్రజల ఆర్థికసాంఘిక దుస్థితిని నివారించుటకై యేర్పరుపబడిన శాశ్వత సాధనము. అందుచేత విదేశవస్త్రముల వర్తకులు ముందు సంగతినిగూర్చి బాగుగా నాలోచించుకొని, దేశక్షేమమును కోరినవారైనచో, తమ విదేశవస్త్ర వ్యాపారమును విడిచిపెట్టుకొనుట మంచిది.

## పికెటింగు

ఈ సందర్భములో పికెటింగునుగూర్చి నేను కొంత చెప్పవలసియున్నది. మనము నీపికెటింగు విడిచిపెట్టుకొనుటకు వీలులేదు. పికెటింగు న్యాయసమ్మతమైన మామూలు హక్కు. కాని దానిని నియమితషరతులకు లోబడి మనము కొనసాగింపవలెను. అప్పుడది యితరులకు బాధ కలిగింపకపోవుటయే కాక యెక్కువ ప్రబోధకముగ గూడ నుండును. ఇట్టి పికెటింగు జరుపుటకు స్త్రీలే యెక్కువ అర్హతగలవారు. అందుచే, ఇదివరకు తామారంభించిన అద్భుతమగు పనిని కొనసాగించి, శాశ్వతమగు భారతజాతి కృతజ్ఞతను తిండిలేక మాడుచున్న కోట్లకొలది ప్రజల యాశీర్వాదములను నారీ(స్త్రీలు) సంపాదించుకొందురని కోరియు నేనాశించుచున్నాను.

## బ్రిటిషు వస్తుబహిష్కరణ

బ్రిటిషు వస్తుబహిష్కరణము రాజకీయ సాధనముగను, బ్రిటిషువారిపై దండన విధానముగ నుద్దేశింపబడినది. కడచిన వత్సరమునందు తుపానువలె ప్రబలిన జాతీయోద్యమమునందు యీ ఆయుధము తీవ్రముగను ప్రయోగింపబడినది. ఇప్పుడది తాత్కాలికముగ నిలుపు చేయబడినది, సంధి సంప్రదింపులద్వారా మన గమ్యస్థానము చేరవలసి యుంటిమి. ప్రస్తుతము బ్రిటిషు వస్తు బహిష్కారము నుపసంహరించి స్వదేశీ యుద్యమమును మాత్రము బలపరచవలెను. స్వదేశీ ప్రచారము ప్రతిజాతిని జన్మహక్కు. మన దేశములో ఉత్పత్తియగు ప్రతి వస్తువునకును మనము ప్రోత్సాహమొసంగవలెను. స్వదేశీవస్తువున్నపుడు దానికి బదులు విదేశీ వస్తువేదైనను సరే, బ్రిటిషు వస్తువుగాని యితర దేశీయుల వస్తువుగాని విసర్జింపవలసినదే. జాతీయాభివృద్ధికి ముఖ్యసాధన మిదియే.

## సమాన హక్కులు

ఆంగ్లేయులకు మనకు వర్తక వాణిజ్యముల విషయమున సమాన హక్కు లుండవలెనని చాల వాదము బయలుదేరినది. బలవంతునకు, బలహీనునకు రాక్షసునకు మరుగుజ్జునకు, ఏనుగకు దోమకు సమానత్వ మెట్లు కుదురును? విశేష తారతమ్యముగల వ్యక్తులకు సమానహక్కు లుండవలెనన్న తక్కువస్థితిలో నున్నవాని నుచ్చస్థితిలో నున్నవానితో సమాన స్థితికి తేవలెను. బ్రిటిషు వారివద్ద మన మింతవరకు నిమ్నజాతులకన్న తక్కువ దశలో నున్నాము. బ్రిటిషు లేక తదితర దేశముల పరిశ్రమల నుండి ముఖ్యముగ భారతీయ పరిశ్రమలకు సంరక్షణ మొసంగుటయే భారతజాతి జీవించి యుండుటకు ముఖ్యసాధనము.

## మద్యనిషేధము

ఆర్థికాభివృద్ధికి విదేశవస్త్ర బహిష్కారము యెట్లవసరమో జాతియొక్క నైతికాభివృద్ధికి మద్య నిషేధముకూడ అట్లే అవసరమైనది. మద్యము రాబడి యంతయు నిషేధ ప్రచారమునకే వినియోగించుటకు ప్రభుత్వమువారు యేర్పాటుచేసినను, మేమీ దుకాణములందు పికెటింగు చేయుచునే యుందుము. దేశములో ఒక్క గజమైన విదేశవస్త్రము, ఒక సారా దుకాణముకూడ లేనంతవరకు మేము పికెటింగు చేయుచుందుము.

## ఉప్పు సత్యాగ్రహము

శాసనములను ఉల్లంఘించు ఉద్దేశముతో మాత్రమే ఉప్పుసత్యాగ్రహము చేయరాదు. ఉప్పుకొఠారులపై దాడి సలుపరాదు. కాని ఉప్పుపంటకు చేరువనుండు పేదవారు ఉచితముగ ఉప్పు చేసికొని విక్రయించుకొనవచ్చును.

## స్వరాజ్యము-పేదలు

గాంధిగారి 11 షరతులు స్వరాజ్య సారముగ నెంచెదరు. రయితులకు సంతృప్తిగొలుపనిది స్వరాజ్యము కానేరదు. భూస్వాములు, రాజులు మహారాజులు మున్నగువారు చెమటూడ్చి పాటుపడు వేలకొలది ప్రజలకుహాని కలిగించకుండునంత కాలము వారి హక్కులను నేను గౌరవింతును. కాని క్రిందనున్నవారిని లేవదీసి దేశమునందలి అత్యున్నతులగు వారితో సరిసమానులుగ జేయుటయే నా కర్తవ్యము. సత్యము అహింసా సందేశములు బాగుగ నాటుకొని జనము తమ గౌరవమును శక్తిని గుర్తించగల్గుట [illegible] కాని యింకను చాల జరుగవలసియున్నది. మనము [illegible] మనకొరకు [illegible] గర్జించవలెను మన స్వల్ప[illegible] కాంగ్రెసు [illegible] సాధించుటకు యున్నదనియు, సేవ శక్తి సామర్థ్యము గలదనియు మన మందరము గుర్తించవలెను.

## అస్పృశ్యత

అస్పృశ్యతా నివారణ విషయమున ఇంకను శ్రద్ధ చేయరాదు హిందువులు పూర్తిగ ఈ పాపమును పోగొట్టుకొని యుండినచో గడచిన యుద్యమము యింక నెక్కుడు ప్రకాశవంతముగ నుండెడిది. ఆత్మపారిశుద్ధ్యమునకు అవసరమగు యీ మహాకార్యము, అస్పృశ్యతా నివారణము జరుగనిచో స్వరాజ్యమునకు అర్హులము కానేరము స్వరాజ్యము చేకూరినను, హిందూమతమునకే మచ్చ గలిగియుండినచో, విదేశవస్త్ర బహిష్కరణము లేనిపట్ల స్వరాజ్యము నరక్షించుకొనుటెంత కష్టముగునో అంత కష్టముగును.

## కావలెను

ఈ క్రింది ప్రాంతములనుండి గోలకొండ పత్రికకు వార్తలువ్రాయు విలేఖరులు కావలయును.

౧. వనపర్తి సంస్థానము
౨. గద్వాల ,,
౩. ఆత్మకూరు ,,
౪. గోపాలపేట ,,
౫. రాయచూరు (టవును)
౬. నిజామాబాదు ,,
౭ మహబూబునగరము,

ఆయా ప్రాంతములవారు విలేఖరులుగా నుండగోరిన మాకు తెలుపప్రార్థితులు.

సంపాదకుడు
గోలకొండ పత్రిక హైదరాబాదు

REG No N 45 Reg. M. No.2185

... Golconda Power Press. Hyderabad. Editor K. Balakrishna Reddy